# పాత్రధారుల పేర్లు

| | పేర్లు | వయస్సు | మారుపేర్లు |
|---|---|---|---|
| 1. | వెంకన్న | 45 సం॥ | నారాయణ |
| 2. | తిరపతి | 50 | ప్రసాద్ |
| 3. | సర్దార్ | 40 | బాబు |
| 4. | ఏడుకొండలు | 40 | సుబ్బారావు |
| 5. | సీతారాం | 30 | మూర్తి |
| 6. | సూర్యం | 30 | సూర్యం |

ఈ నాటికకు సంబంధించిన యావత్తు ప్రింటింగ్ పబ్లిషింగ్ హక్కులు ఉదయసాహితి, విజయవాడ-1 వారివి. మిగతా ప్రదర్శన, రేడియో వగైరా హక్కులు శ్రీ కాలెపు అప్పలస్వామి, సీతన్నపేట, విజయవాడ-2 వారికి చెంది వున్నవి.

# పాత్రధారుల పరిచయం

వెంకన్న – వయస్సు 45 సంవత్సరాలు తిరపతి గారింట్లో నౌకర్ కట్టుపంచ తలగుడ్డ బనిమెన్ తిరపతిగారికి నమ్మినబంటు

తిరపతి – వయస్సు 50 సంవత్సరాలు. ఖద్దరుదుస్తులు, కళ్ళకు అద్దాలు కాళ్ళకు చెప్పులు, వక్కీకర్ర. బాధ్యత కలిగిన పదవుల్లో వుంటాడు. తెలివిగలవాడు. స్వార్థపరుడు వ్యభిచారి

సర్దార్ – వయస్సు 40 సంవత్సరాలు కళ్ళకు అద్దాలు కాళ్ళకు చెప్పులు వక్కీకర్ర మాటకారి పదవివ్యామోహ పరుడు మురా తత్వంలో ఆరితేరినవాడు స్వార్థపరుడు మంచివిలువైన దుస్తులు ధరిస్తాడు వ్రేళ్ళకు వుంగరాలు చేతికిగడియారం

ఏ.కె. కొండలు – వయస్సు 40 సంవత్సరాలు డబ్బుగలవాడు పరి శ్రమల యజమాని పదవివ్యామోహపరుడు అంతా మోసం దగా మాటల్లో వ్యక్తమవుతుంది. పట్టినా మాలు పెడతాడు. కాళ్ళకు చెప్పులు. సాదా దుస్తులు వేళ్ళకు వుంగరాలు

సీతారాం – వయస్సు 60 సంవత్సరాలు సర్దార్ ఏజంటు పెద్ద మనుష్యుల నిజస్వరూపాలు బయట పెడతాడు సాదాదుస్తులు – తెలివిగలవాడు

సూర్యం – వయస్సు 32 సంవత్సరాలు పేదవాడు మంచినటకుడు చిరిగినచొక్కా చిరిగినపంచ గడ్డం మాసివున్నది కట్టన్ బోయ్. అంటూరు.

[అది తిరపతిగారి యింటిలో ఒకభాగం. అదేఆఫీసుగది. ఆఫీసుగదిలోనికి రావాలంటే బయటనుంచి ఒకద్వారం? యింటిలోనికి ఒకద్వారం మాత్రమే వున్నాయి. ఆఫీసులో ఒకడ్రాయరు, మూడుకుర్చీలు, డ్రాయరుమీద కొన్నికాగితాలు పుస్తకాలు పేపరుపైట్సు కొన్నిఫైల్సు వున్నాయి. ఒకగడియారం, కలం, సిరాబుడ్డి మాత్రమే వున్నాయి ఆఫీసుమాత్రం చాలానీటుగావుంది. డ్రాయిర్ క్రింద వేస్టుపేపరు కాగితముల బుట్ట, గోడకు ఒక దేవుడుఫోటో రాజకీయ నాయకులఫోటో లున్నాయి తెర లేచేటప్పటికి తిరపతి కుర్చీలో కూర్చుని వుంటాడు. ఒక్క క్షణం తర్వాత కుర్చీలో కూర్చున్నవాడు లేచి లోపలున్న వెంకన్నను పిలుస్తాడు]

తిరపతి : వెంకన్నా. వెంకన్నా.

వెంకన్న : (లోపలనుంచి) వస్తున్నా బాబుగారు (వచ్చాడు)

తి : నావుత్తరీయం కర్రపట్రా

వెం : బజారెళ్తారాబాబు?

తి : కాస్తపనుంది

వెం : భోంచేసి వెళ్ళండయ్యా

తి : బజారుకెళ్ళివచ్చి భోంచేస్తాలే

వెం : ఎప్పుడొస్తారో ఏమో

తి : గంటలో వస్తా నాకోసం కనిపెట్టు కూర్చుంటాను. ఆలస్య మైతే ఫోం చెయ్యండి

వెం : బాబూ. ఎలెక్షన్లు వస్తానాయటగా

తి : అవును వెంకన్నా. అభ్యర్థిగా పోటీచేస్తావా

వెం : నేనా

తి : ఏం?

వెం : నాకెందుకు బాబూ. యిలా బతకనివ్వండి. తమదయ వలన

తి : (నవ్వి) ఊ. రానీ చేతికర్ర వుత్తరీయం పట్టుకురా

వెం : (లోనికెళ్ళి చేతికర్ర వుత్తరీయం పట్టుకొచ్చాడు)

తి : (తీసుకొని) వెంకన్నా

వెం : బాబు

తి : వెళ్ళొస్తా

వె : బాబుగారూ

తి : ఊ

వె : తమరు నిలబడకూడదూ బాబూ.

తి : (కుర్చీలోనుంచిలేచి) యిదిగో నిలబడి ఉన్నా.

వెం : అదికాదు బాబు. ఎలెక్షన్లో నిలబడకూడదా అని

తి : నిలబడొచ్చు. బాగానే వుంటుంది. అందులో చాలా కష్టాలున్నాయ్.

వెం ; (ఆశ్చర్యంగా) కష్టాలా? ఎంతమంది [illegible] పొందుతు న్నారు? మీరు కష్టాలంటారు.

తి : నీకు తెలియదు వెంకన్నా, నీతిగా వున్నవాడికి మంచినీళ్ళు పుట్టవ్. సంపాదనే పనిగా పెట్టుకున్నవాళ్ళు చాలామం మున్నారు.

వెం : పాపం దేవయ్యగారు ఎలాంటివారు చివరకు (ఏమో చెప్పబోతున్నాడు)

తి : ఆ గొడవంతా ఎందుకు చాలా బాధపడ్తునాట్ట

వెం : వారి ఆస్తిఅంతా నాశనమై పోయింది. ధర్మరాజు తెల్ల నివన్నీ పాలనుకునేవారు

తి : యింట్లో చెప్పు గంటలో వస్తానని

వె : అలాగే బాబు.

తి : ఎవ్వరన్నా వస్తే వుండమను

వెం : తమరుభోజనానికి తప్పకుండావస్తారు కదుబాబు

తి : తప్పకుండా (అంటూ బయటకెళ్ళాడు)

వెం : తిరపతి బయటకెళ్ళిన తర్వాత వెంకన్న లోనికెళ్ళాడు)

స : (బయటనుంచి లోనికొచ్చాడు వచ్చి) తిరపతిగారు (అంటూ పిలచి కుర్చీలో కూర్చున్నాడు)

వెం : (లోపలనుంచి) ఎవరూ

స : తిరపతిగారున్నారా?

వెం : లేరండి. యిప్పుడే బజారుకెళ్ళారు.

స : ఎప్పుడొస్తారూ?

వెంకన్న : ఒక్క గంటలో వస్తారు తమరు. (అంటూ లోపల నుంచి వచ్చి సర్దార్‌నుచూచి) మీరా. నమస్కార మండి ఎవరో అనుకున్నాను

సర్దార్ : అనుకుంటావ్. తిరపతిగారెప్పుడెళ్ళారు.

వెంకన్న : మీరు వచ్చేదానికి ముందు.

సర్దార్ : ఊ... వెంకన్నా.

వెంకన్న : బాబయ్యా.

స : చాలా ప్రమాదం జరిగింది వెంకన్నా

వెం : ఎవరికండి

స : మనకే

వెం : (ఆశ్చర్యంగా) ఆ. మనకే ఏం ప్రమాదం బాబు

స : యింతవరకూ ఎవ్వరికైనా ద్రోహం చేశానంటావా

వెం : తమరా ద్రోహం చేసింది అని ఎవరంటారు.

స : పూర్తిగా నమ్మకం వుందిగా నేను యిప్పటివరకూ ఏ విషయంలో ఎవ్వరికీ అన్యాయం చెయ్యలేదని.

వెం : నమ్మకం లేకపోవడం ఏమిటిబాబు తమరు చెప్పాలా?

స : నమ్మినవాడిని మోసం చేస్తాడా?

వెం : ఎవరుబాబు మోసం చేసింది?

స : సీతారాం విషయం పూర్తిగా కాకున్నా కొంతైనా తెలుసా?

వెం : పూర్తిగా తెలుసు.

స : ఎక్కడివాడో ఎక్కడనుండి వచ్చాడో. ఏమీ తెలియదు రోడ్ల వెంట బికారి వెధవలతో తిరుగుతూ ఉంటే ఒక్క పెద్దమనిషి చెప్పారు చాలామంచివాడు. తిండిలేకుండా బాధపడు తున్నాడు మీరు సహాయం చెయ్యండని. ఆ పెద్దమనిషి మాట కాదనలేక సరేఅన్నా

వెం : తమ యింట్లోనే ఉన్నాడుగా.

స : ఆ నాయింట్లోనే వుంచుకున్నా. నాతమ్ముడులాగు చూచు కుంటున్నా. ఎంతడబ్బు కావలిస్తే అంతా యిస్తున్నాను ఈనాడు నాకు వ్యతిరేకమయ్యాడు

వెం : సీతారామయ్యా? మన సీతారామయ్యే!

స : మన. అలా అనుకోవడమే పొరపాటు. పశువూ ప్రతిష్ఠా నాశనం జేస్తాడా మనకు వ్యతిరేకులతో చేతులు కలుపుతాడా.

వెం : ఎంతమోసం మీరు యింట్లో చేర్చేటప్పుడే అనుమా నించాను. చెప్పాలనుకున్నాను. అయినా నిజంచెప్తే నమ్ముతారా అనుభవానికి వచ్చేటప్పటిగానీ తెలి యదు నా అనుమానమే నిజమైందన్నమాట.

స : సీతారాం విషయం బాగా తెలుసా.

వెం : లేరండి. యిప్పుడే బజారుకెళ్ళారు.

స : ఎప్పుడొస్తారూ?

వెంకన్న : ఒక్కగంటలో వస్తారు తమరు. (అంటూ లోపల నుంచి వచ్చి సర్దార్‌నుచూచి) మీరా. నమస్కార మండి ఎవరో అనుకున్నాను

సర్దార్ : అనుకుంటావ్. తిరపతిగారెప్పుడెళ్ళారు.

వెంకన్న : మీరు వచ్చేదానికి ముందు.

సర్దార్ : ఊ... వెంకన్నా.

వెంకన్న : బాబయ్యా.

స : చాలా ప్రమాదం జరిగింది వెంకన్నా

వెం : ఎవరికండి

స : మనకే

వెం : (ఆశ్చర్యంగా) ఆ. మనకే ఏం ప్రమాదం బాబు

స : యింతవరకూ ఎవ్వరికైనా ద్రోహం చేశానంటావా

వెం : తమరా ద్రోహం చేసింది అని ఎవరంటారు.

స : పూర్తిగా నమ్మకం వుందిగా నేను యిప్పటివరకూ ఏ విష యంలో ఎవ్వరికీ అన్యాయం చెయ్యలేదని.

వెం : నమ్మకం లేకపోవడం ఏమిటిబాబు తమరు చెప్పాలా?

స : నమ్మినవాడిని మోసం చేస్తాడా?

వెం : ఎవరుబాబు మోసం చేసింది?

స : సీతారాం విషయం పూర్తిగా కాకున్నా కొంతైనా తెలుసా?

వెం : పూర్తిగా తెలుసు.

స : ఎవ్వడో ఎక్కడవుట్టాడో. ఏమీ తెలియదు రోడ్ల వెంట బికారి వెధవలతో తిరుగుతూ ఉంటే ఒక్క పెద్దమనిషి చెప్పారు చాలామంచివాడు. తిండిలేకుండా బాధపడు న్నాడు మీరు సహాయం చెయ్యండని. ఆ పెద్దమనిషి మాట కాదనలేక సరేఅన్నా

వెం : తమ యింట్లోనే ఉన్నాడుగా.

స : ఆ నాయింట్లోనే వుండమన్నా. నాతమ్ముడులాగునా చుకుంటున్నా. ఎంతడబ్బు కావలిస్తే అంతాయిస్తున్నాను ఈనాడు నాకు వ్యతిరేకయ్యాడు

వెం : సీతారామయ్యా? మన సీతారామయ్యే!

స : మన. అలా అనుకోవడమే పొరపాటు. వసువ్రా ప్రతిష్టా నాశనం జేస్తాడా మనకు వ్యతిరేకులతో చేతులు కలుపుతాడా.

వెం : ఎంతమోసం మీరు యింట్లో చేర్చేటప్పుడే అనుమా నించాను. చెప్పాలనుకున్నాను. అయినా నిజంచెప్తే నమ్ముతారా అనుభవానికి వచ్చేటప్పటిగానీ తెలి యదు నా అనుమానమే నిజమైందన్నమాట.

స : సీతారాం విషయం బాగా తెలుసా.

వెం : తెలుసా? ఆయన మావూళ్ళో నే కొంతకాలం వున్నారు వూళ్ళోవాళ్ళని ముంచి ఈవూరొచ్చి మీదగ్గర చేరాడు ఆయన మావూళ్ళో వుండగా ఒక్కరోజు కూడా, తగదా లేకుండా వుందా? అలాంటివారిని మీరు చేర్చుకున్నారు.

స : ముందుగా చెప్తే ఎంత బాగుండేది. లోకయ్యగారిక్కి మనకూ పచ్చిగడ్డివేస్తే భగ్గుమంటుంది. ఆ విషయం అందరికీ తెలుసు

వెం : అందరికేమిటి లోకానికంతా తెలుసు, లోకయ్యగారి దగ్గరకెళ్ళాడా.

స : వెళ్ళటం ఏమిటి డబ్బు తీసుకున్నాడు.

వెం : తీసుకున్నాడూ. ఆ. ఎంత మోసం. ఎంత మోసం ఎంత డబ్బు తీసుకున్నాడు?

స : మూడువందలు.

వెం : ముష్టి మూడువందలు కోసం. సరాసరా వెళ్లి లోకయ్య గారి పార్టీలో కలుస్తాడా. రానీయండి. వాడిఅంతు తేల్చేస్తాను.

స : తొందరపడకు. నువ్వేమైనా చేస్తావని తెలుసు, ముందుగా మనవాళ్ళతో చెప్పడం మంచిదికదూ. జాగ్రత్త పడొచ్చు తిరిగి వాడితో ఈవిషయం అనకు, తిరిపతిగారితో చెప్పాలను కున్నాను. మనంజాగ్రత్తగా వుండటం మంచిదికదూ.

నెం : మాంచిదే అనుకోండి కానీ లోకయ్యగారితో కరనిసాలి చెప్పాను. ఆమాట విన్న దగ్గరనుంచీ నా వొళ్లుమండుతుంది, వాడిభరతం పట్టేవరకూ నిద్రపట్టదునాకు. మిమ్మల్ని అడిగితే యివ్వరూ డబ్బు ఎంతయినటంలా

స : యిస్తున్నా నా పదిహేను రోజులక్రితం అయిదు వందలు నష్టపడ్డాను. ఆరోజన్నా ఒక్కమాటన్నానా. ఎవ్వరితోనైనా చెప్పానా చెప్పాలంటే లక్షాతొంభైయ్ వున్నాయ్. ఆఖరకు శ్రీకృష్ణజన్మస్థానానికి వెళ్ళాల్సినంతపని చేశాడు. అప్పటికి సహించాను.

నెం - తిన్నయింటికే వాసాలెక్కట్టేజాతి. యిలాంటివాళ్లను పాపమనకూడదండి బొమికలు విరగదియ్యాలి. మీరు ఊ అనండి రేపీపాటికి వాణ్ణి జనరల్ ఆస్పత్రిలో జాయిన్ చేయిస్తా చూడండి వెంకన్న మాటన్నాడంటే జరిపితీరుతాడు.

స - చేసితీరుతావని తెలుసు నీకున్న విశ్వాసం వాడికిలేదు అంతవరకూ ఎందుకు ముందున్నది ముసళ్ళపండుగ తొందరపడ్తేఎట్లా ఎలెక్షన్లు వస్తున్నాయ్. అవి కాస్త అయిపోతే వీడివిషయం తేలుస్తా.

నెం - అంతవరకూ వూరుకుంటాను. ప్రయోజనం మన వ్యతిరేకులతో కలసి చెయ్యాల్సిన ప్రచారం చేస్తాడుగా

స - అక్కడే ఉన్నాయ్. మన తెలివితేటలు ఎన్నికకు ప్రచారం చేస్తాడు. సెలక్షన్‌లో వాళ్ళున్నాఁతేగా. ప్రచారం చెయ్యటానికి.

వెం - అదీ నిజమే సెలక్షన్ కావద్దూ. పొరపాటున వాళ్ళ అభ్యర్థి సెలక్షన్ అయితే

స - ఎలా అవుతాడు. మనతిరుపతిగారు సెలక్షన్ కమిటిసభ్యులు తిరపతిగారు నిర్ణయిస్తేగా సెలక్షన్ కావటానికి మెజారిటీ మనది. నెగ్గితే మనమే నెగ్గాలి ఏమంటావ్. ఈ దెబ్బతో లోకయ్యగారి పార్టీని నామూరూపాలు లేకుండా చేసిపారెయ్యాలి

వెం .. తమరు తలచుకుంటే తిరుగుండా అయినా తిరపతి గారితో మాట్లాడారా.

స - అందుకనేగా రావటం.

వెం : యింతకూ మనఅభ్యర్థి ఎవరండి

స : ఎవరో అయితే యీబాధంతా ఎందుకు నేనే

వెం : మీరా.

స - (నవ్వి) ఏం నేను పనికిరానూ,

వెం - ఎంతమాట మీకు తిరుగుండా మీరు నిలబడాలి గానీ ఎదుట వాళ్ళకి డిపాజిట్ వస్తుందా అని.

స - వెంకన్నా చాలా మంచివాడివోయ్.

వె : తమకు ఈనాడు తెలిసింది నామంచితనం. ఏఒక్కరికి ఏపరిస్థితిలో మోసంచేసే పద్దతినాకులేదు. నామంచి తనంచూచి తిరపతిగారు మాఊరునుంచి తీసుకొచ్చి తనదగ్గర నౌకరుగా వుంచుకున్నారు

స : ఆవిషయం తిరపతిగారెన్నోసార్లు చెప్పారు నీవిషయం వెంకన్నా

వెం : అయ్యో

స : ఒక్క సహాయం చెయ్యాలి

వెం - నేనా ఎంతమాట నాఅంతస్థు ఎక్కడ తమఅంతస్థు ఎక్కడ తమకు సహాయంచేసే పాటివాడ్నా

స - సామాన్యుడవా వెంకన్నా తిరపతిగారికి నమ్మిన బంటువి నీమాటంటే తిరపతిగారికి శిలాక్షరం ఎట్లాగైనా మన విషయంలో ఒప్పించాలి

వెం - దేనికి

స - బాగుంది. రామాయణమంతావిని రాముడికి సీతఏమౌ తుందిఅని అన్నాడట నీలాంటివాడే

వెం - నాకేం అర్థంకాలా

స - అర్థంకాలా ఎం. ఎల్. ఏ గాపోటీ చెయ్యాలనుకున్నాను ఆవిషయం తిరపతిగారికి చెప్పమని

వెం - ఆ. నేనా లాభంలేదండి. తమరేస్వయంగా మాట్లా డండి వారిస్వభావం మీాకు తెలుసు రికమండేషన్ అంటే భగ్గుమంటారు

స - అడిగితే కాదనరు. యితరులకైతే తప్పకుండా అడిగేవాణ్ణి యిది నాస్వంతవిషయం. అందుకని నీతో చెప్తున్నది ఒంటరిగా వున్నప్పుడు ఈవిషయం

వెం - జ్ఞాపకం చెయ్యమంటారు దానికేం తప్పకుండాచేస్తాను అంగీకరించక పోతే ప్రమాదమే

స - బేషుగ్గా అంగీకరిస్తారు నువ్వు చెప్పాలిగానీ నావిషయం అంటే చాలు. ఎప్పుడూ ఏపరిస్థితిలోనైనా. తిరపతిగారు కాదని అంరు అనలేరు.

వెం - అలాఅయితే. తమరే స్వయంగా మాట్లాడండి. మధ్య లో నే నెందుకు

స - అలా నకు ఎంత చెడ్డా మధ్యవర్తిలేకుండా ఏవ్యవహారం సెటిల్ కాదు. నీరుణం వుంచుకోనులే సాయంత్రం యింటికిరా

వెం : వొద్దుబాబు వెంకన్న నిజాయితీగలవాడు యింతవరకూ ఎవరిదగ్గర ఏమీలంచం తీసుకోవటం ఎరగను. డబ్బు కోసం గడ్డికఱచే వాణ్ని కాదు

స : తప్పుగా అర్ధంచేసుకుంటావెందుకు నీకుడబ్బిస్తానన్నానా రాత్రిమనయింట్లో భోజనాలున్నాయ్ ఆసందర్భములో రమ్మంటున్నా అంతే

వెం : భోజనానికైతే ఎందుకురాను తప్పకుండావస్తా

బయట : శ్రీనివాసగారు. తిరపతిగారు.

స : ఎవ్వరోవచ్చారుచూడు

వెం : (బయటద్వారం దగ్గరకెళ్ళిచూచి) ఏడుకొండలుగారు

స : వాడితాడు తెగ ఎందుకొచ్చాడు

వెం : ఆయనగారికేంపనుందో. రండిబాబు. రండి

ఏడు : (లోనికివచ్చి) వెంకన్నా తిరపతిగారున్నారా (సర్దార్
గార్నిచూచి) నమస్కారమండి తమరెప్పుడొచ్చారు
(అంటూ కుర్చీలోకూర్చున్నాడు)

స – (ప్రతినమస్కారముచేసి) యిలదయచేసారేం

ఏ : ఆరోగ్యం సరిగ్గాలేదు డాక్టర్ గారి దగ్గరకెళ్ళి వస్తున్నా

స : సుస్తీఏమిటి

ఏ : ఈమధ్య అజీర్తి ఎక్కువైంది

వెం : బాబు మీరు మాటాడుతా ఉండండి యిప్పుడేవస్తాను
(బయటకెళ్ళాడు)

ఏ : ఈడాక్టర్లున్నారు చూసారూ యమకింకరులండి రోగం
తెలియదు మందులిస్తారు ఆమందుఎలావుంటుంది విషం
అబ్బ. చంపేస్తున్నారండి

స –ఇంగ్లీషుమందు లొచ్చాయి. రోగాలెక్కువైనాయ్.
పూర్వం యింతమంది డాక్టర్లున్నారా చెప్పండి. ఈనా
డుచూడండి ఏబజార్లో చూచినా బజారుకు కనీసం
యిద్దరన్నా డాక్టర్లున్నారు

: తెపలియకడుగుతా మనల్ని అడుగుతారేమిటండి. జబ్బేమి
టని. జబ్బు ఏమిటో తెలియని వాళ్ళంతా డాక్టర్ల
య్యారు డబ్బుగుంజటానికి

స : నిజమేనండి. పకృతివైద్యశే రైటండి. దానిని మించింది
ఏమీలేదు అదిసరేగాని మనవ్యాపార మెట్లావుంది

ఏ : ఏం వ్యాపారమండి ఆకొత్తఆఫీసర్ వచ్చాక మనప్రాణాలు
తీస్తున్నాడు. అబ్బ. అబ్బ వాడిల్లతాడు తెగ మనిషి
కాదండి మంగళగిరి పానకాల రాయుడు

స : మనదగ్గర కొచ్చాడు. వాడి ప్రతాపం చూపబోయాడు
ఖచ్చితంగా చెప్పాను. అశ్వాయ్ నీ వ్యవహారం
మాదగ్గర పనికిరాదని కావలిస్తే మీగురుస్తాను కను
క్కున్నా. అంతే ఇంతెనరకూ కనిపిస్తేవొట్టు.
చెప్పేవుంటాడు వాళ్ళగురుస్తా మన విషయం

ఏ : ఎట్లాగైనా మీరు సమర్థులు. కాస్త వాడితో మాట్లాడండి
మన విషయం ఒకదపా ఏమంటాగు

స : దానికేం తప్పకుండా రేపేవెళదాం అదిసరేగాని ఏడు
కొండలుగారు మీరేం ఆలోచించారు.

ఏ : దేని విషయం

స : ఎలెక్షన్లు వస్తున్నాయ్ వాటి విషయం మీ అభిప్రాయం

ఏ : అభిప్రాయానికేముంది పెద్దలువున్నారు. మీరు తిరపతి
గారు. మీమాటకి ఎగురు చెప్పామా ఎన్నడన్నా.

స : యింతవరకూ చెప్పలేను. కాని, ఒక్కరహస్యం ఎవరితో ఎక్కడా చెప్పకూడదు, మనిద్దరి మధ్య మాత్రమే ఉండాలి బయటకి పొక్కిందా చాలా ప్రమాదం మన మంచికే.

ప : ప్రాణం పోయినా రహస్యం రెండో మనిషికి తెలియ నిస్తానా

స : పరిస్థితులు చూస్తున్నారా. మనకు వ్యతిరేకంగా ఎలా వున్నాయో మీ విషయం ఆలోచించుకోండి. ఆ ఆఫీసర్‌తో యింతగాఢన వస్తున్నారా వాడి తాహ తేమిటి. వాడేనా మనమీద స్వారి చెయ్యాల్సినవాడు.

ప ; అవును నిజమే.

స : నిజమేంటి మొన్న అంజయ్యగార్ని ట్రాన్స్‌ఫ్యూషన్ చేయిస్తా నంటాడా. వాడి నెత్తిమీద రాగికానీపెడ్తే చెల్లుబడికాడు. అలాంటి వెధవ అంజయ్యగారిలాంటి పెద్దసాహుకార్ని పట్టుకొని వానిష్టమొచ్చినట్టు వాగు తాడా.

ప : మన అంజయ్యగార్ని అంతమాట అన్నాడా.

స : ఎందుకనడు. మనం చేతులుముడుచుకు కూర్చున్నంత కాలం వాళ్ళిష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తారు.

ప : వూరుకున్నారా అంజయ్యగారు.

స : చెయ్యాల్సిన పనిచేసాం. వదలిపెడ్తామా. అదె అధికారం మన చేతిలో వుంటే.

ఏ : నాకు అర్థం కావటంలేదు. మీరు చెప్తున్నది.

స – సమయం వచ్చింది. మనమంతా ఏకం కావాల్సిన సమయం ఆసన్నమైంది. అందుకని ఈ ఎలెక్షన్‌లో మనమంతా ఒక్కమాటమీద నిలవాలి.

ఏ – మీరు చెప్తున్నది కాదని ఎవ్వరూ అనరు. అనలేరు. తిరపతిగారు ఏమంటారు.

స – ఆ విషయం నేను చూచుకుంటాను. మనవాళ్ళంతా ఏకంగావుంటేచాలు పెత్తనం మనచేతుల్లోకి వస్తుంది, ఈ ఆఫీసర్లు వంచేస్తారు. కుక్కిన పేనుల్లా నోరు మెదపకుండా కూర్చుంటారు.

ఏ – తిరపతిగారి విషయంచూస్తే, భయంగావుంది, సెలక్షన్ కమిటి మెంబరుగా వేశారు. పొరపాటున మన గ్రూపు వాళ్ళు కాకుండా. వూరూ. పేరూలేని ఏ సన్యాసి వెధవనో నిర్ణయిస్తే చాలా ప్రమాదమే.

స : యింతపిచ్చి వాళ్ళేమిటండిమీరు. అవసరమొస్తే మనం కావాలి డబ్బుకోసం మనంకావాలి. మనసహాయం లేకుండా. తిరపతిగారు ఒక్కవ్యవహారం చెయ్యమనండి తెలుస్తుంది. నేను చెప్పినట్టు మనవాళ్ళంతా వినండి. ఒకవేళ తిరపతిగారే వ్యతిరేకంగా ప్రవర్తించారా.

దేవయ్యగారి కేగతి పట్టింది. అదే జరుగుతుంది ఎంత మందిని చూసాను. యిలాంటి వాళ్ళను.

: సమర్థులుమీరు ఎంతపనైనా చేస్తారు. ఆ విషయం నాకు తెలుసు మీరు చెప్పినట్లాను ప్రకారమేగా. దేవయ్య గారికి వ్యతిరేకంగా నేను పనిచేసింది బాధ్యతమీద ఆరు నెలలు అయ్యేటప్పటికి అయ్యగారు ఊరోదలి మూట ముల్లే కట్టుకొని అర్థరాత్రి పరారయ్యాడు.

: ఎవ్వరూ చూడకుండా చూస్తే పరువుపోతుందని. అదేగతి పడుతుంది ప్రతీ ఒక్కడికి. తిరపతిగార్ని నాయకుడు కావాటానికి కారకు లెవ్వరు.

: మీరే

: ఊ అర్థమైందా. మనవాళ్ళందరికీ చెప్పండి రేపురాత్రికి మనయింట్లో సమావేశం లోకయ్యగారితో మాట్లా డాను వారుసరే అన్నారు. తప్పకుండా రావాలి. ఎవ్వ రికీ తెలియనివ్వకండి

: లోకయ్యగారొస్తారా.

: ఆయ నెందుకొస్తారు. అండర్ గ్రౌండ్ వర్కు చేస్తున్నారు. అంతా మనకు అనుకూలంగావుంది. మీరుమాత్రం ఊ అంటేచాలు

ఆ మా దేముంది. నలుగురితో పాటు మీమాటకాదని ఎన్నడన్నా అన్నానా.

స : అనలేదు యింతవరకూ. యీాదపా ఆ నిర్ణయానికే కట్టు
బడి వుండాలి.

ఏ : తప్పకుండా

స : వెంకన్న వున్నాడే వాడు చాలా ప్రమాదకరమైన మనిషి. వాడికి ఈ విషయం. నామ మాత్రమైనా తెలియ నివ్వకండి

ఏ : మీాకూ తెలిసింది వాడివిషయం. పైకి మెత్తగా కనిపిస్తాడు

స : కాలాంతకుడు. వస్తాను మరచిపోకండి. రేపురాత్రికే రావాలి తొమ్మిదిగంటలకే ఎవరికీ తెలియకూడదు. వస్తారుగా. సెలవు (అని బయటికెళ్తున్నాడు)

వెం : (బయటనుంచి వస్తూ వెళ్తున్న సర్దార్‌ను చూచి) ఏం బాబుగారు వెళ్ళిపోతున్నారు.

స : తర్వాతవస్తా. తిరపతిగారికిచెప్పు వచ్చి వెళ్ళానని (వెళ్ళాడు)

వెం : చిత్తం.

ఏ : వెంకన్నా.

వెం : అయ్యా.

ఏ : నీ విషయంచూాస్తే చాలా బాధగా వుందోయ్,

వెం : నన్నుచూాస్తే తమకేం బాధయ్యా.

ఏ : (నవ్వి) అమాయకుడవోయ్. పాపం ఎలా బతుకుతావో
ఏమో నిన్ను చూస్తే జాలేస్తుంది

వెం : హాయిగా బతుకుతున్నా. ఏచీకు చింతాలేకుండా

ఏ : అదికాదోయ్. యిప్పుడొక ప్రమాదమొచ్చింది

వెం : ఎవరికిబాబు

ఏ : ఎవరికో అయితే యీబాధంతా ఎందుకు నీకు

వెం : నాకే ఏంప్రమాదంబాబు

ఏ : మనసర్దార్ గారి నిజస్వరూపం బయట పడిందోయ్

వెం : సర్దార్ గారి నిజస్వరూపమే

ఏ : ఆ. సర్దార్ గారి నిజస్వరూపమే ఈనాటితో బయటపడింది.
పదవీ వ్యామోహం. ఎంతపనైన చేయిస్తుంది. చివరకు
నీచమైన ప్రచారం చెయ్యటానికైనా వెనుకాడదు
ఏమంటావ్

వెం : ఏంజరిగిందిబాబు

ఏ : లోకయ్యగారి దగ్గర డబ్బుతీసుకున్నావా

వెం : నేనా

ఏ : ఆ నువ్వే

వెం : ఎవరన్నారు

ఏ : యింకెవ్వరు. సర్దార్ గారే

వెం : అన్నారూ ఏపాపంఎరగనండి. ఎలాఅన్నారండి ఈమాట
తిరవతిగారికి తెలిస్తే బతకనిస్తారా నన్ను

ఏ : అదేనేనూ బాధపడుతున్నాను. పాపం అన్నం పున్నెం ఎర
గని. అమాయకుడిమీద అపవాదు వేస్తాడా

వెం : ఎవరితో అన్నాడు

ఏ : ఎవరైతేఏం. అన్నాడు అంతవరకూ సత్యం

వెం : మీరువిన్నారా

ఏ : వినకపోతే నాకెట్లా తెలుస్తుంది. ఈవిషయం తిరవతిగారికి
తెలిస్తే వెంకన్న బ్రతుకేమవుతుంది. పాపం. వెంక
న్నచచ్చినా అలాంటిపని చెయ్యడు. యిక ఎన్నడూ
ఈ తప్పుడు కూతలు ఎక్కడా ఏసందర్భములోనైనా
అన్నావా మర్యాద దక్కదని. నాలుగుచీవాట్లు వేశాను

వెం : ఎవరు సర్దార్ గార్నే

ఏ : ఏంచేస్తాడు తప్పుడు కూతలుకూస్తే, సర్దార్ గారొచ్చి
చెప్పలేక ఆయనేజంటుగార్ని పంపాడు. నాతో చెప్ప
మని

వెం : సర్దార్ గారు మీతో అనలా

ఏ : ఆయనగారు ఈయనతో అన్నాట్ట ఏజంటుగారొచ్చినాతో
అన్నాడు అంతే

వెం : ఎవరుబాబు ఆఏజంటు వాడిసంగతి తేల్చుకుంటాను

ఏ : తొందరపడకు సేవున్నాగా అన్నీ చక్క పరచటానికి. ఈ విషయంలో నీజోక్యం మాత్రంపనికిరాదు

వె : తమకెందుకు శ్రమ. పేరు చెప్పండి. వాడి చావో నా చావో యీరోజుతో తేలిపోతుంది.

ఏ : వుద్రేకం పనికిరాదు అన్నీ సరిచేస్తాగా

వె : సీతారామయ్యేనా. వాడి వ్యవహారశ్రుతి మించింది లెండి! లోకయ్యగారి దగ్గరడబ్బు తీసుకున్నదివాడు. తిరిగి నామీంద అపవాదులేస్తాడా.

ఏ : సీతారాం తీసుకున్నాడా

వెం : ఆ తీసుకున్నాడు. కావలిస్తే సర్దార్ గార్నే అడగండి తెలుస్తుంది

ఏ : ఊ సర్దార్ గారు చెప్పారన్నమాట ఎప్పుడు చెప్పారు

వెం : ఎప్పుడైతే ఏం. యిందులో సర్దార్ గారికి పోయేదే ముంది. ఆ సీతారామయ్యే చేస్తున్నాడు కావాలని. రానీయండి. వాడిపొంతు తేల్చుకుంటాను.

ఏ : తొందరపడ్డేవెట్లా దేనికైనా ఆలోచనకావాలి. అప్పటికీ మందలించ్చాను. సీతారాం కావాలని చేసిన. ప్రచారం మాత్రంకాదు. పూర్తిగావిను.

వెం : చెప్పండి.

ఏ : ఎట్లాగైనా, రెండు గ్రూపుల్ని కట్టుకొని, తిరపతిగార్ని దెబ్బకొట్టాలని ప్రయత్నం చేస్తున్నారు సర్దార్ గారు.

ఈ విషయం తిరపతిగారికి చెప్పాలనే వచ్చారు. లోక య్యగారితో రాజీచేసుకున్నారు.

వెం : ఎవరు రాజీచేసుకున్నా

ఏ : యింకెవరు. సర్దార్ గారు.

వెం : సర్దార్ గారు. లోకయ్యగారితో రాజీచేసుకున్నారా. వచ్చి అబద్దం. లోకయ్యగారికి సర్ దార్ గారికి వచ్చి గడ్డివేస్తే భగ్గుమంటుందే ఎట్లా కలుస్తారండి. ఒకవేళ కలిసారంటే నమ్మే వాళ్ళెవ్వరండి.

ఏ : ఎందుకు కలవకూడదూ. పదవికోసం ఎంతపనైనా చేస్తారు. దేవయ్యగారు ఎలాంటివారు. వేళ్లుపెట్టి చూపగల్గారా ఎవ్వరన్నా. ఈనాడు ఏమయ్యారు. పతనమైపోలా దేశంకి పతనమైపోయారు. పదవికోసం.

వెం : నిప్పటివారు. ఆయనచేసిన త్యాగం ఎవరుచేశారు.

ఏ : ఎంతత్యాగంచేస్తే ఏం ప్రయోజనం

వెం : నాకు తెలిసినంతవరకూ, పదవికోసం ప్రాకులాటం ఎప్పుడూ కనిపించలాఆయనలో అయిదెకరాలు నిక్షేపం లాంటి మాగాని రాజకీయ బాధితుడుగావస్తే. కోర్టులో యినుకపత్ర యిచ్చేవరకూ నిద్రపోయారా మీరు.

ఏ : నేనా.

వెం : మీరే. ఎవరికి తెలియదు. మీకు చీకటికావచ్చు లోకమంతా చీకటికాదు.

ఏ : వెంకన్నా. తెలిసే మాటాడుతున్నావా.

వెం : బాగా తెలిసేమాటాడుతున్నా. ఆయన అధికారంలో వుంటే మీఆటలు సాగవని కుట్ర చేసిందిమీరు. ఉప్పు సత్యాగ్రహంలో మీ రెక్కడున్నారు. ఆనాడు రావు సాహెబు. రావుబహద్దూర్ బిరుదులు తగిలించుకొన్న పెద్ద మనుష్యులంతా చేరి నిజాయతీగల మా రాజుని వెళ్ళగొట్టారు.

ఏ : వెంకన్నా ఎవరితో మాటాడుతున్నావో తెలుసా.

వెం ; నాకు తెలియక పోవడమేమిటి. వున్నవీ లేనివీ కల్పించి ఏరోటి దగ్గరపాట ఆరోటి దగ్గరపాడగల సమర్థులు. బోడితలకూ మోకాటికి ముడివేసే మహానుభావులు. ఏ ఎండకు ఆ గొడుగుపట్టే అవకాశవాదులనీ తెలుసు తెమసంగతి తెలియకపోవడ మేమిటి

ఏ : ఓహో చాలాదూరకొచ్చిందే వ్యవహారం. ఊ అర్థమైంది.

వెం : ఏం అర్థమైంది. కొంపలు దోయటమా

ఏ : నోరుముయ్. ఎవడికొంప దోసాను. పిచ్చిపిచ్చిగా వాగకు జాగ్రత్త. పెద్దా చిన్నా తారతమ్యం లేకుండా నీ యిష్టం వచ్చినట్టు వాగుతున్నావ్. నీ బ్రతుకెంత కళ్ళు మూసుకుపోయి మాట్లాడుతున్నావ్. భయం భక్తి లేకుండా

వెం : మీ మోచేతికింద బతకటంలేదు భయపడ్డానికి

ఏ : ఊఁ చూస్తాను. ఏడుకొండలంటే ఏమిటో తెలుసుగా తిర పతిగారొచ్చిన తర్వాతగాని నీవ్యవహారం బయట పడదు.

వెం : ఏం పర్వాలా ఎవరొచ్చినా

ఏడు : ఎంత పొగరెక్కిందె (పళ్ళు కొరికి) బికారి ముండా కొడకా ఛీ. ఈవూళ్ళో చారెడునీళ్ళు పుట్టనిస్తే నీకు. నాపేరు ఏడుకొండలని పిలవకు (అంటూ విసురుగా బయటి కెళ్ళాడు)

వెం : బయలు దేరాడు తలతీసే మొనగాడు యీనాటికి (అంటూ లోనికెళ్ళాడు)

సీతారాం : (బయటనుంచి లోనికొచ్చాడు వచ్చి ఆఫీసంతా కలయచూచి కుర్చీలో కూర్చున్నాడు. సిగరెట్టు వెలి గించాడు)

వెం:కన్న : (వచ్చాడు)

సీ : ఏం వెంకన్నా ఏమిటి కబుర్లు

వెం : (సీతారాంని చూచి) ఏమయ్యా సీతారామయ్యా ఈ వూళ్ళో ఉండదలచుకున్నావా లేకుంటేమకాం మారా లనుకున్నావా.

సీ : (ఆశ్చర్యంగా) ఏం.

వెం : ఏం. ఎందుకొచ్చావ్

సీ : వస్తే తప్పా.

వెం : యికనుంచి యిక్కడకొస్తే మర్యాద దక్కదు.

సీ : ఓ. అలాగే. తిరపతిగా రొచ్చేవరకూ వుండి వారితో మాటాడి వెళ్తాను. అంతవరకూ

వెం : ఉంటానంటావ్

సీతారాం : తప్పకుండా ఉండి తీరాలి

వెం : అలా వీలులేదు

సీ : ఎందుకు లేదు

వెం : లేదని చెప్తున్నా అంతే (కోపంగా గట్టిగా అరిచాడు)

సీ : వెంకన్నా. ఏమిటి ఎందుకట్లా అంటున్నావ్. ఏంచేసాను నేను

వెం : నావిషయం చెప్పు నిన్ను నేను ఎప్పుడన్నా ఏమన్నా అన్నానా

సీ : అనలేదే

వెం : నీకు ఏవిషయంలోనైనా ద్రోహంచేసానా

సీ : ఎవ్వరన్నారు

వెం : నమ్మకం వుందా ద్రోహం చెయ్యలేదని

సీ : చాలా మంచివాడవని ఎంతమందికి చెప్పాను కాని,

వెం : కానీలేదూ అర్థం లేదూ. నీవిషయం పూర్తిగా తెలిసింది నామీద ప్రచారం మొదలెట్టావా. నీకు నేను ఏం ద్రోహం చేసానని యింత అన్యాయమా

సీ : నాకర్థం కావటంలా

వెం - అర్థంకాలేదు. ఎంత నాటకం

సీ - నాటకమా? ఏం నా కం

వెం - ఏంనాటకం. ఎన్ని కొండల లార్నుంచే ఈ ఊరెలావచ్చావ్ కష్టపడకుండా ఎలా జీవిస్తున్నావ్.

సీ - వెంకన్నా (అని గట్టిగా అరిచాడు)

వెం - కోపం వచ్చిందా. పద్యాలా లోకయ్యగారి దగ్గరడబ్బు తీసుకున్నానని ప్రచారం చేస్తావా.

సీ - ఎవరు చెప్పారు.

వెం - ఎవరంటా వేం పిల్లికళ్ళుమూసుకొని పాలు తాగుతూ లోకమంతా చీకటనుకుందట. లోకయ్యగారిదగ్గరడబ్బు తీసుకున్నది నువ్వు. ఆ అపవాదు నామీద వేస్తావా. వాళ్ళపార్టీతో చేతులు కలిపింది నువ్వు. అప్రచారం నామీద చేస్తావా.

సీ - ఎవరన్నారు నేను డబ్బు తీసుకున్నానని వెంకన్నా. నా మాట నమ్ము. ప్రమాణపూర్తిగా చెపుతున్నా. లోకయ్యగారి దగ్గర వెంకన్న డబ్బు తీసుకున్నాడని ప్రచారం మొదలెట్టింది ఏడుకొండలుగారు. కావలిస్తే ఏడుకొండలగార్ని తీసుకొస్తాను. లోకయ్యగారి ముఠాలో కలవటానికి అవసర మేమొచ్చింది నాకు. ఎంత డబ్బు కావలిస్తే అంత యిస్తున్నారు. సర్దారుగారు. తిన్నయింటికి వాసాలు లెక్కపెట్టే పద్ధతి నాదికాదు.

వెం - నిజమేనా.

సీ – నమ్మకంలేదా నేను చెప్పిందాంట్లో

వెం – ఎలా నమ్మమంటావ్ చూస్తె అంతా అయోమయంగా వుంది

సీ – మనకు తెలియకుండా. చాలా గొడవలు జరుగుతున్నాయ్. వెంకన్నా నిజం వయటపడే రోజువచ్చింది ఏకుకొండల్ని తీసుకొస్తాను. ఏం జరిగిందో చెప్పాలి.

వెం – తప్పకుండా. చెప్తాను. నాకేం భయం చెప్పకపోవడానికి సర్దార్ గార్ని తీసుకురా.

సీ – పెద్దవారు వారెందుకు.

వెం – పెద్దలందరికీ తెలియడం మంచిది

సీ – తీసుకొస్తాను జాగ్రత్తసుమా (బయటికెళ్తున్నాడు)

తి – (బయటనుంచి వచ్చాడు) ఏం సీతారాం ఎప్పొచ్చావ్

సీ – యిప్పుడేవస్తా

తి – వెళ్తున్నావేం.

సీ – వస్తాను పనుంది (వెళ్ళిపోయాడు)

తి – (కాళ్ళుచెప్పులు విడిచాడు కుర్చీలోకూర్చొని) వెంకన్నా మంచినీళ్లు పట్రా. (వెంకన్న లోనికెళ్ళి మంచినీళ్ళు తీసుకొనివచ్చి తిరపతికిచ్చాడు తిరపతిమంచినీళ్ళు త్రాగి గ్లాసు వెంకన్నకు యిచ్చాడు) వెంకన్నా.

వెం – అయ్యా.

తి – ఎవ్వరన్నా వచ్చారా.

వె – సర్దార్ గారు. ఏడుకొండలు గారొచ్చారయ్యా

తి – వచ్చారా. వస్తారు. అంతావస్తారు. వెంకన్నా.

వెం – అయ్యా.

తి – లోకయ్యగారి దగ్గిర డబ్బుతీసుకున్నావా.

వెం – నేనా ఎవరు చెప్పారుబాబు (అంటూ చేతిలో గ్లాసు కిందపడిపోతుంది)

తి – ఎవ్వరు చెప్పితే ఏం తీసుకున్నమాట నిజమేనా

వెం – యింతకాలం నుంచీ తమదగ్గరుంటున్నా. ఆమాత్రం తెలియదా బాబు. వెంకన్న ఎలాంటివాడో.

తి – ఎవరు ఎలాటివారనేది నిర్ణయించడం చాలాకష్టం. ఎవరి మాట నిజం. ఎవరిమాట అబద్దం. తెలియకుండావుంది. ఈమధ్య లోకయ్యగారితో మాట్లాడటం జరిగిందా.

వె – నెలరోజుల క్రితం లోకయ్యగార్ని చూసాను బ్రాడీ పేటలో కార్లోకూర్చున్నారు. ఏం వెంకన్నా బాగున్నావా అన్నారు అంతే. అంతకంటే లోకయ్య గారితో యింతవరకూ మాట్లాడలేదు. వారిని చూడా లేదు. ఆ మాత్రం నమ్మకంలేదా బాబు నామీద

తి – నమ్మకం లేకపోవడం ఏమిటి. యింతకాలం నాదగ్గర వుండనిస్తానా. నమ్మకం లేకపోతే.

వెం: బాబు తమ పరువు ప్రతిష్టా నాశనం చేస్తున్నారు పన వులకోసం నీతినియమాలు వదలిపెట్టి వాళ్ళయిష్టం

వచ్చినట్టు ప్రచారం మొదలెట్టారు పెద్దమనుష్యులు దయచేసి తమరు ఒకసహాయం చెయ్యాలయ్యా

తి : చెప్పు వెంకన్నా

వెం : నిజం బయటబడే రోజువచ్చిందయ్యా. ఆ పెద్దమనుష్యు లొస్తారు. తమరు మాత్రం ఈవిషయంలో జోక్యం కలుగచేసుకోకుండా వుండాలి సబాయ్యా.

తి – పర్వాలా అసలు విషయం చెప్పు వెంకన్నా.

వెం – ముందుగా చెప్పడం ఎందుకుబాబయ్యా. వింటేతమకే తెలుస్తుంది. ఒక్కొక్కరి నిజస్వరూపం వయటపడు తుంది.

తి – వెంకన్నా ఏమిటోఅనను. కానీచాలాప్రమాదాలున్నాయ్ జాగ్రత్తగా ఆలోచించుకో

వెం – తమరు అండగావుంటేచాలు బాబయ్యా ఎన్నిప్రమా దాలున్నా ఏం చెయ్యలేవు.

తి – అంతా గందరగోళంగావుంది. ఊ కానీ. నేను యింట్లో వున్నట్టు ఎవరికీ తెలియనివ్వకు (ఎవ్వరోవస్తున్నట్టు చప్పుడు వినబడుతుంది) ఎవరోవస్తున్నారు. జాగ్రత్త (అంటూలోనికెళ్ళాడు)

ప – (వచ్చి) తిరపతిగారు. తిరపతిగారు.

వె – అలా కేకలేస్తారెందుకు

ఏ – కేకలానావి. తిరపతిగార్ని పిలిస్తె నీ కెందుకు. తిరపతిగారు తిరపతిగారు.

వెం – వారు లేరండి

ఏ – వచ్చారని చెప్పారు

వెం – రాలేదని చెప్తున్నా.

ఏ – వచ్చిన తర్వాత వస్తాను (బయటికెళ్తున్నాడు)

వెం – ఆగండి కూర్చోండి

ఏ – కూర్చోటానికి రాలేను. మాట్లాడానికొచ్చాను. వారు లేరుగా వచ్చిన తర్వాతేవస్తాను.

వెం – మాట్లాడానికే వచ్చారనుకోండి. కాని కూర్చోండి పనుంది.

ఏ – ఎవరితో

వెం – మీతోనే

ఏ – నాతో నీకేంపని

వెం – మనుష్యులన్నవారికి పన్లులేకుండా ఉంటాయా

ఏ – కొందరితో వుంటాయ్ అందరితో వుండవ్.

వెం – అందరితో అందరికీ పనులుంటాయ్ కూర్చోండి.

ఏ – ఏమిటోయ్. పెద్దఅధికారిలాగు

వెం – నేనేం అధికారిని లెండి సర్దార్ గా వుండమన్నారు.

ప : నీతో చెప్పారా. వచ్చినతర్వాతే రావచ్చు(బయటికెళ్ళాడు)

బయట : ఏడుకొండలుగారా రండి వస్తున్నారేం. (అంటూ ఏడుకొండలు. సర్దార్, సీతారాం లోనికొచ్చారు)

వెం : రండి కూర్చోండి

అందరూ : (కుర్చీల్లో కూర్చున్నారు)

ప : (సర్దార్‌తో) మీారుండమన్నారటగా

స : తిరపతిగారు రమ్మన్నారని సీతారాం చెప్పాడు. ఏరా సీతారాం ఏరి తిరపతిగారు

ప : సీతారామే చెప్పాడు తిరపతిగారు రమ్మన్నారని

సీ : తిరపతిగారు పిలుచుకురమ్మంటేమీతో చెప్పాను. లేకుంటే నాకేంపని. వెంకన్నా ఏరి తిరపతిగారు.

వెం : వస్తారు. (సీతారాంతో) ఏమయ్యా సీతారామయ్యా. లోకయ్యగారి దగ్గర డబ్బుతీసుకున్నానా నేను.

సీ : ఎవరు చెప్పారు.

వెం : ఏడుకొండలుగారితో మీారు చెప్పారటగా.

సీ : ఏమండి మీాతో చెప్పానా. వెంకన్న డబ్బుతీసుకున్నాడని.

ప : నేనా. ఎప్పుడు. ఎక్కడ ఎవ్వరితో.

వెం : మీారు చెప్పారా నాతో సర్దార్‌గారు. సీతారామయ్య చెప్పాడని. సీతారామయ్య మీాతో చెప్పాడని అసలా

ఏ : (నవ్వి) సీతారాం చెప్పాడని నేను నీకు చెప్పానా ఆ హా, బలే ప్రచారం మొదలెట్టావ్.

స : ఏం వెంకన్నా ఎవరూ దొరకలానీకు ఏడుకొండలుగారే దొరకారా నేను చెప్పానని సీతారాం ఏడుకొండలు గార్కి చెప్పడం ఏడుకొండలుగారు నీతో అనడం చాలా బాగుంది. ఎంత బాగా ఆడావు నాటకం. మా యిద్దరిమధ్య తగవులు పెట్టటానికి మంచిప్లాను వేశావ్ నాటకమంటే అలావుండాలి

వెం : నాటకమా. ఏమండీ (ఏడుకొండలతో) మీకు చెప్పలా ఎవరితో చెప్పొద్దని, నేను మందలించ్చానని అనలా

ఏ : చూసారండీ ఎంత అబద్ధమో పుట్టుకతో నేవస్తాయ్ అబద్దాలు అబద్దాలాడాల్సిన అవసరమేముంది మాకు

వెం : అబద్దాలుమావి అవును డబ్బున్న వాళ్లు, ఎన్ని అబద్దాలాడిన చలామణి అవుతాయ్. సర్దార్ గారి నిజస్వరూపం బయట పడిందని అనలా మీకు. అదీ అబద్ధమేనా.

స : నా నిజస్వరూపమా.

వెం : మీ నిజస్వరూపమే. బయటపడిందని చెప్పాను. లోకయ్యగారితో రాజీచేసుకున్నారని చెప్పారు.

స : ఏమండీ ఏడుకొండలుగారు. లోకయ్యగారితో నేను రాజీ చేసుకున్నానా. అమాట ఎట్లా చెప్పావయ్యా పెద్ద మనిషి.

స : పచ్చి అబద్ధం. ఇదంతా పచ్చిఅబద్ధం. కావాలని కల్పిస్తున్న నాటకం ఏమీ తెలియదండీ నాకు

వెం : ఏమీ తెలియదు ఆ. హా. అలావుండాలి నాటకమంటే

స : (కోపంతో) వెంకన్నా. జాగ్రత్తగా మాట్లాడు. మాలో మాకు తగవులు పెట్టమని చెప్పారా లోకయ్యగారు. యిదంతాచూస్తే లోకయ్యగారి దగ్గర డబ్బుతీసుకొని తగవులు పెట్టడానికి ప్రయత్నం చేస్తున్నట్టు కనబడుతుంది లోకయ్యగారు ఎన్నిచేసినా మేమంతా ఒక్కటే. మాలో మాకు యిప్పటికి ఎప్పటికీ అభిప్రాయబేదాలు రావు అది నిజం. ఆ మాట లోకయ్యగారితో చెప్పు

వెం : ఆ, సేనా.

స : అవును నువ్వే. యిదంతా తెలిస్తే తిరపతిగారు ఏమనుకుంటారు తిరపతిగారి దగ్గరచేరి నువ్వు చేసేపనియిదా. నీతి నిజాయితీ లేనివాళ్ళను నౌకరుగా వుంచుకోవడం తిరపతిగారిదే బుద్ధితక్కువ.

వెం : ఆ నీతి నిజాయతీలేని వాడినా (సర్దార్‌తో) అయ్యా ఎవరి నిజాయితీ ఎలాంటిదో తెలియజేసే అవసరం వచ్చింది. నాకుభయంలేదు పోతేనౌకరీ పోతుంది అంతే నాప్రాణాలు తియ్యలేరు మిమ్మల్ని ఒక్కటేప్రశ్న అడుగుతున్నా జవాబు చెప్తారా. అబద్ధమాడకుండా

స : ఏడ్చావ్. నీకుజవాబు చెప్పాల్సిన అవసరం ఏముంది వదండి ఏడుకొండలుగారు. ఎంగిలి మెతుకుల వెధవలు తిరపతి గారొచ్చిన తర్వాతే రావచ్చు, వాడి బతుకెంత వాడెంత వాడేనా మనల్ని ఎదిరించి మాటాడేవాడు కుక్కను సింహాసనంమీద కూర్చోబెడితే ఏంచేస్తుంది

ఏ : చర్మం వొలిపించాలి

స : అనుకుంటే ఎంతపని. చిటికేసేలోగా జరిపించేస్తా తిరపతి గారి మొఖంచూచి వదలిపెడ్తున్నా పదండి (కెళ్తూన్నారు)

తి : (లోపలనుంచి వచ్చాడు వెళ్తూన్న వాళ్ళను చూచి) ఆగండి

అం : (వెళ్తూన్న వాళ్ళు ఆగి తిరపతిని చూచి నివ్వెరపోతారు) మీారున్నారా

తి : యింట్లో ఏదోపనిలో ఉన్నాను. కూర్చోండి

అందరూ : (కూర్చున్నారు)

తి : వెంకన్నా చాలామంచివాడనుకున్నాను కాని ఈరోజు తెలుసుకున్నా

స : బికారిముండా కొడుకుల్ని చేరదీస్తే ఏముంది చెప్పండి చిన్నా పెద్దాలేకుండా. వాడిష్టమొచ్చినట్టు వాగుతాడా

తి : ఊ

ఏ : ఒక్కమాట. అబ్బ. మిమ్మల్నిచూచి పూరుకోవాల్సి వచ్చింది

వెం : చెప్పండి ఎన్ని చెప్పినా వర్యాలా

ఏ : చూశారా. మీ ఎదుగ్గానే ఎలా ఎదిరిస్తున్నాడో

తి : వెంకన్నా పెద్దమనుష్యులు. యింటికొస్తే నీయిష్టంవచ్చి నట్టు మాటాడడమేనా. విశ్వాసంగుం వాడననుకున్నాను యిదేనా నీ విశ్వాసం. నమ్మాను. నాయింట్లో అధికార మంతా అప్పగించాను చివరకు. ఆ ప్తమిత్రులు యింటికొస్తే వాళ్ళను అవమాన పరుస్తావా యిదేనా నీకృతజ్ఞత యిదేనా నీ విశ్వాసం చీ నీ బ్రతుకు చెడ పుట్టావ్ ఎందుకు చావరాదు

నెం : (ఏడుస్తూ) బాబు మీకుకూడ అదే మాట

తి : సర్దార్ గార్ని విమర్శించవలసిన వాడివేనా వారి తాహతేమిటి? నీ తాహతేమిటి? వాకు యిష్టం హారేసిన చోట్ల ఖరీదు చెయ్యగలవా. ఏడుకొండలుగార్ని ఎదిరించే పాటివాడివా. వారి కాళ్ళగోటి ఖరీదు చెయ్యగలవా వారినేనా విమర్శించవలసిన వాడివి. అన్నీ అబద్ధాలు. యింతవరకూ నమ్మాను. మోసం. దగా, నామీదే ప్రచారం. నా పరువూ ప్రతిష్టా అంతానాశనంచేస్తారా. (ఏడుస్తూన్న వెంకన్నను చూచి) ఎందుకేడుస్తావ్. సిగ్గులేక, బుద్ధిలేదు నీగుండెమీద చెయ్యి వేసుకొని చెప్పు. లోకయ్యగారిదగ్గర ఎంత తీసుకున్నావ్.

వెం : నేనా

తి : నువ్వే చెప్పు

వెం : ప్రమాణపూర్తిగా చెప్తున్నా. నామాట నమ్మండి. ఏ పాపం ఎరగనండి. నన్ను నమ్మండి.

తి : యింతవరకూ నమ్మాను. ఏమండీ ఏడుకొండలు గారు లోకయ్యగారి దగ్గర వెంకన్న వందరూపాయలు తీసుకున్నమాట నిజమేకదూ.

ఏ : అబ్బే నాకేం తెలుసండి. సర్దార్ గారు చెప్తే ఆవిషయం మీకు చెప్పాను అంతే.

స : నేను మీకు చెప్పానా, ఎందుకయ్యా ఆ అబద్దాలు.

ఏ : నావా అబద్దాలు. మీరు చెప్పలా నాతో. నిజంచెప్తున్నా వినండి. సర్దార్ గారే చెప్పారు. ముమ్మాటికి నిజం. ఏ ప్రమాణం చెయ్యమన్నా చెయ్యటానికి సిద్దంగా వున్నాను.

స : తెల్లవారితేచాలు. అదేపని అబద్దాలు. చీటికి మాటికి అబద్దాలు నీకు. నాకేంపోయింది అబద్దాలు చెప్పటానికి అభూత కల్పనలతో మోసం చేయకండి.

ఏ : అభూత కల్పనలు నావేకదూ. యీ యెలక్షనులో ఎలాగైనా గెలవాలనే అభిప్రాయంతో మీరు లోకయ్యగారితో రాజీ చేసుకున్నానని చెప్పారా లేదా,

స : నేను లోకయ్యగారితో రాజీ పడ్డానా, యిదొకనాటకమా

ఏ : నాటకమా, మనకు అనుకూలంగా ప్రవర్తించకపోతే తిరవలిగార్ని నాశనం చేస్తామనలా,

వెం : నన్ను యింటికి రమ్మన్నారు. లంచానికి. అలాంటిపనులు చేయను బాబు. తిరపతిగారికి తెలిసిందంటె నాప్రాణం తీస్తాః. మీాకు చెప్పదలచుకున్నది తిరపతి గారికే చెప్పాడి అన్నాను! పైగా సీతారామయ్య లోకయ్య గారిదగ్గర డబ్బు తీసుకున్నాడు, వాడ్ని నమ్మకండి, తిరపతిగారికి ఈవిషయం చెప్పమన్నారు, ఏమండీ చెప్పారా లేదా యిదీ అబద్దమేనా,

సీ : నేనా లోకయ్యగారి దగ్గర డబ్బు తీసుకున్నానా

వెం : మూాడువందల రూపాయలు తీసుకున్నావని చెప్పారు,

సీ : (సరదార్ తో) ఏమండీ మీాకు చెప్పారా. మీాకిన్నాళ్లన్నందుకు చివరకు మీారే యిలా చెప్తారా

స : యిదంతా కట్టుకథ సీతారాం, కావాలని కల్పిస్తున్న నాటకం. మోసం. దగా

తి : వెంకన్నా. నాచొక్కా జేబులో వుత్తరం తీసుకురా

వెం : ఏచొక్కా

తి : ఉదయం విడచిన చొక్కా

వెం : (లోనికెళ్ళి వుత్తరం తీసుకొనివచ్చి తిరపతికిచ్చాడు)

తి : (వుత్తరంతీసుకొని) ఈవుత్తరం మీారురాసిందే వినండి (చదువుతున్నాడు) శ్రీ యుతులు లోకయ్యగార్కి నమస్కారములు. 3వ. తేది రాత్రిమీాకునేనూ మాట్లాడిన విషయం గుర్తుచేస్తున్నాను. లోగడ జరిగిపోయిన విషయాలుగూర్చి మీారు కలవర పడకండి. అనుకో

కుండా జరిగిపోయినయ్. ప్రస్తుతం ఆలోచించండి. తిరిగి మన బలాన్ని వృద్ధిచేసుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. ఎట్లాగైనా ఈసభా తిరపతిగార్ని దెబ్బతియ్యాలి నేనుప్లాను వేశాను. 8వ తేది రాత్రి రహస్యసమావేశం వేస్తున్నాను ఏడుకొండలుగార్ని మనతరపున పని చేయటానికి ప్రయత్నంచేస్తున్నాను. ఎంతవరకంటేమన అవసరం వరకూ అంతే.అవసరమైతే కమిటి సభ్యులుగా నలుగుర్ని యిరికిస్తామంటే చాలు తిరిగిపోతారు. మెజారిటీ మనకొస్తుంది. యిక తిరపతిగారి విషయం తనకు తిరుగులేదనే భావంతో విర్రవీగు తున్నాడు ఈదెబ్బతో దేవయ్య కేగతి పట్టిందో అదేగతి పడ్తుంది. సందేహం లేదు. అదివిషయం మరోవిషయం మాసీతారాం ఉన్నాడే వాడుమంచివాడుకాదు. చాలాప్రమాదకరమైన మనిషి. వాడ్ని నమ్మకండి నేనుఎంతవరకు ఉపయోగించుకోవాలో అంతవరకే. మీప్రయత్నం మీరు చేయండి

సెలవు,

నమస్కారములతో.

సర్దార్.

(వుత్తరం చదువుచున్నంతవరకూ అందరూ తెల్లబోతారు)

తి : దీన్ని కాదనలేను కన్పించిందికాదు ఈఉత్తరంఎలావచ్చిందో చెప్పను కావలిస్తే మీరాస్వాదనస్తూరి చూడండి

స - (వెనుకగా వచ్చి ఉత్తరం చింపాలని ప్రయత్నం చేస్తాడు)

వెం - (అడ్డుపడి) ఉత్తరం చింపాలనుకున్నారా, ఎంత పెద్ద మనుష్యులండి మీరు.

సీ - (సర్దార్ తో) మీదగ్గరున్నందుకు ప్రతిఫలం యిదేనా. ఏం ద్రోహం చేసానో చెప్పండి. గతిలేక మీదగ్గర చేరాను. మీరు చెప్పినట్లల్లా ప్రవర్తించాను. మీకు పడాల్సిన శిక్షలు నాకుపడ్డాయి. సారాబట్టీలు పెట్టి సారాకాయించింది, పేకాటరూంలు పెట్టింది మీరు. యింకా చెప్పాలంటే చాలావున్నాయ్. రూపేను ఎక్కడ నాశనం అవుతుందో అని. మీకు యంత్రంలాగు వుపయోగ పడ్డాను చివరకు నామీద ప్రచారం చేస్తారా.

స - సీతారాం అయిపోయింది. పూర్వోక్త నువ్వా యిదే మాట నిన్ను నమ్ముకున్నాను అన్యాయం చేస్తావా.

సీ - అవసరంవస్తే మేముకావాలి అవసరం తీరితే హీనంగా తన్ని బయటకు గెంటేస్తారు. అదేగా మీలోవున్నది. అన్నను ఈవాడు ప్రతిచోటా జరుగుతున్నది యిదే, నేను దొంగను బేవార్సుగా తిరిగేవాడ్ని. ఎన్నో అబద్ధాలాడి జీవించాను ప్రజల దృష్టిలో సీతారాం అంటే ఎంత చెడు అభిప్రాయముందో మీకు నాకూ తెలుసు ఆ అభిప్రాయం రావటానికి కారణం. ఈనాటి నిరుద్యోగమే కారణం. కాని ఒక్క విషయం. పెద్దమను

ష్యులుగా చెలామణి అవుతున్న దొంగలు మీరు. కాదంటారా.

అందరు — మేమా దొంగలం.

సీ — మీరే దొంగలు

అందరు — ఏడ్చావ్. నువ్వు దొంగవి. మీ సర్దార్ దొంగా.

సీ — తొందర పడకండి. అంతా చెపుతాను. మీరే ఒప్పుకుంటారు. మన అందరి నిజస్వరూపాలు బయట పడడం మంచిది. ఏమండి ఏడుకొండలుగారూ. నిజం చెపుతారా అబద్ధం చెపుతారా. చెప్పండి

ఏ — అదేం ప్రశ్న

సీ — అదేం ప్రశ్న. మీరు ఎం. ఎల్. ఏ పదవికి పోటీచెయ్యాలని అనుకుంటున్నారా లేదా.

ఏ — నేనా ఎప్పుడు. ఎక్కడ ఎవరితో అన్నాను.

సీ — ఎవరితోకాదు నాతో అనలా. లోకయ్యగార్ని ఆశ్రయించారా లేదా. కావలిస్తే మీరు రాసిన ఉత్తరం వుంది. తీసుకురమ్మంటారా. ఎం. ఎల్. ఏ పదవి దేనికి కావాలనుకున్నారో చెప్పమన్నారా.

ఏ — అక్కర్లేదు.

సీ — అక్కర్లేదంటే పట్లా, మన నిజస్వరూపాలు బయట పడాలి. నల్లమందు వ్యాపారంలో ఎంతసంపాదించావు. నల్లమందు, గంజాయి వ్యాపారంలో సంపాదించిన

లక్షాయాభై యేవేల రూపాయలు పెట్టేగా మీరు యం. ఎల్, ఏ గా పోటీ చెయ్యాలనుకున్నారు గవర్నమెంటుకు సప్లయ్ చేసిన బియ్యంలో ఎన్నిబస్తాలు రాళ్ళకలిపారు. యింకెంటూరున్న ఎంత ఎగవేసారు. వాటికంతా లెక్కలున్నాయా. తిరపతిగారికి వ్యతిరేకంగా పనిచేద్దామనుకోలా. జైలుకెళ్ళకుండా జైళ్ళకెళ్ళినట్లు దొంగసర్టిపికెట్టు సంపాదించి. దేవయ్యగారికిచ్చిన మాగాణిపొలం అయిదెకరాలు, గుంజుకోలా. ఇవ్వన్నీ నిజమంటారా లేదా. చేసిన పాపం చెప్పుకుంటే పోతుందంటారు.

ఏ – తిరపతిగారు! నన్ను క్షమించండి. నాతప్పులు క్షమించండీ. మీకు ద్రోహం చేయ్యాలనుకున్నాను. క్షమిస్తారా. శీతారాం చెప్పింది అంతానిజం (తిరపతిరెండుచేతులూ పట్టుకున్నాడు)

తి – వ్యాపారంలో అప్పుడప్పుడు పొరపాట్లు జరుగుతుంటాయ్. అవి జరగకుండా చూచుకోవాల్సిన అవసరమున్నది. మానవుడు తప్పు చేస్తాడు, ఆ తప్పు ఏ రూపంలో జరిగిందా అన్నదే సమస్య, మీరు చేసింది వ్యాపారంతో కొంత చేసారు. పరిస్థితులువలన కొంత చెయ్యాల్సి వచ్చింది, యికనుంచి అలాంటి తప్పులు చేయకుండా చూచుకోండి,

సీ – తిరపతిగారు మీరు చెప్తారా నిజం

తి - ఏం చేసాను.

సీ - చెప్పమంటారు. జ్ఞాపకం రాలేదుకదూ. మీరు మరచి పోవాలనుకున్నా మరిచిపోలేరే. ఎట్లామరిచి పోయారా అని అనుమానం (ఆలోచించి) ఆ మూడు సంవత్స రాల క్రితం అనుకుంటా. విజయవాడలో. పేటపేరు గాంధినగరం రోడ్డు నాగేశ్వర రావు రోడ్డు పెద్దమేడ. ఆ ప్రక్కనే కిళ్ళీకొట్టు ఆసందులో వేశ్యలు కాపుర ముంటున్నారు. జ్ఞాపకంవుందా వాళ్ళ యజమానురా లకు అయిదువందలు రూపాయలిచ్చి ఒక అమ్మా యిని తీసుకొచ్చారు, ప్రస్తుతం మీతో కాపురం చేస్తూ. తమ ధర్మపత్ని అని చెప్పుకుంటున్న అమ్మాయి ఆవిడేకాదూ. ఇప్పటికీ వెళ్తూవుంటారు మీరు ఆ వేశ్యల యిళ్ళకు వారం రోజులక్రితం విజ యవాడ వెళ్ళివచ్చారు. మీరు విజయవాడ వెళ్ళి నప్పుడు ప్రతీదఫా ఆ వేశ్యల యిళ్ళలోనే మకాం. కాదంటారా మీరు అగ్నిసాక్షిగా పెండ్లి చేసుకున్న వారు ఎక్కడున్నారో చెప్తారా.

తి - (మౌనం)

సీ - చెప్పలేరు. ఎలాచెప్తారు. ఎక్కడున్నారో మీరు తెలి స్తేగా చెప్పడానికి, వయస్సు ముదిరిందనే నెపంతో యింట్లోనుంచి వెళ్ళగొట్టారు. పైగా ఆవిడ విజయ వాడలో చనిపోయిందని ప్రచారం చేశారు. పాపం

ఆమెవచ్చి నాదారి ఏమిటండి అంటే నీ దారి గోదారని చెప్పారు. ఆ యిల్లాలు మీాకు బాధ్యతగల పదవుల్లో వున్నారని అల్లరిచేస్తే మీా పరువూ. ప్రతిష్టా ఎక్కడ నాశనమౌతుందో అని మీాకు కనిపించకుండా తనకు ఎవ్వరూ లేరని ముష్టి ఎత్తుకొని జీవిస్తుంది. యిది నిజ మంటారా అబద్ధమంటారా.

తి – తప్పుచేసాను. సీతారాం ఆమె ఎక్కడుందో చెప్తావా.

సీ – వారం రోజుల క్రితం విజయవాడలోనే కనిపించారు, ప్రస్తుతం అక్కడె వుండొచ్చు.

తి – అన్యాయం చేసాను, (కళ్ళవెంట నీరుకారు తున్నాయ్)

సీ – వెంకన్నా. నిజం చెప్తావా.

వె – నిజం చెప్తాను. ఎప్పుడో జరిగినకథ

సీ – కథకాదు వాస్తవం. ఎప్పుడో కాదు. నాలుగుసంవత్సరాల క్రితం జరిగింది. నిత్యమూ నిన్ను బాధిస్తున్నది. మన్నిద్దరిదీ ముత్యాలంపాడు విజయవాడకు సమీాపంలో వున్నది.

వె – అవును ముత్యాలంపాడు.

సీ – నాలుగు సంవత్సరాల క్రితం జరిగిన సంఘటన. వెంకన్నకు వయస్సు మళ్ళింది. పెండ్లి చేసుకున్నాడు. మొదటి భార్య చనిపోతే. రెండో పెండ్లి చేసుకున్నవ్.

వె – అవును నా మొదటిభార్య చచ్చిపోయింది. కలరావచ్చి.

సీ - పెండ్లి చేసుకున్నాడు ఆ అమ్మాయి వయస్సులో ఉన్నది. చాలా చక్కగా అందంగా వుంటుంది. ఆ అమ్మాయిని అనుమానించాడు. అభం. శుభం. ఎరగని అమాయకురాలు. ఆరు నెలలు గర్భిణీ. కట్టెపుల్లలు నెపంతో. కట్టెపుల్లలకు తీసుకెళ్ళాడు. సరిగ్గా రెండు గంటలవుతుంది. ఎండ మండిపోతుంది. నోరు ఎండిపోయింది మంచినీళ్ళు కావాలని అన్నది. కట్టెపుల్లలు కొట్టడానికి ఏలూరు కాలవకూ. పదిగజాలు దూరం అనుకుంటూ యిద్దరూ కాలవకు మంచినీళ్లు త్రాగటానికెళ్ళారు. ఆత్మృతకోలది అమాయకురాలు. మంచినీళ్ళు త్రాగుతుంది. వెనుకనుంచి వెంకన్న నీళ్ళలోనికి నెట్టాడు. అంతే. పైగా కేకలేసాడు తనభార్య కాలవలో పడి కొట్టుకుపోతుందని. యిది మన నిజస్వరూపాలు అందరమూ నిజస్వరూపాలతో నాటకం ఆడుతున్నాం.

నె - (ఏడుస్తూ) పాపం చేసాను, అన్యాయం చేసాను.

సీ - నాటకం అయిపోయింది. అరె సూర్యం తెరవేయరా. యింత లైయిమైతే ఎట్లాక్లయిమాక్సు దెబ్బ తింటుంది. ఎటు పోయాడు అంతు లేకుండా.

ప్రసాద్ - మేకప్ రిహార్సల్సుగా పర్వాలా

మూర్తి - రేపు రాత్రికి మధ్యలో తెరవేశాడా. చచ్చేంత పని జరుగుతుంది.

నారా - వాడి ప్రవర్తన మంచిది కాదురా.

బాబు – ఆరె ప్రసాద్. డబ్బుకోసం ఏపనైనా చేస్తారు. అబ్బి ప్రాణాలు తీస్తారు.

ప్ర – వాడిగోల మన కెందుకురా. రేపురాత్రికి సరిగ్గా పది గంటలకే. నాటకం ప్రారంభించాలి.

సుబ్బారావు – ప్రదర్శనం యిలావుంటే పర్వాలా

మూ – నారాయణ ఎంత బాగావేడ్చాట్రా.

ప్ర – వాడి మొఖం వాడేం చేసాడు. నేను ఎలాచేసానంటావ్ అందర్నీ వూపి పారేసాను.

మూ – సూర్యానికి వేషం కావాలన్నాడ్రా

ప్ర – తెరలు కట్టేవానికి వేషమేమిటి

సు – మాట్లాడడం చేతకాదు

నారాయణ – అందర్నీ విమర్శించేవాడు

బాబు – వూరుకుంటె ఎన్నన్నా వాగుతాడు

సూర్యం – (ప్రవేశం) నారాయణ, నారాయణా

నా – ఏం

సూ – యింట్లో అవసరమొచ్చింది, ఒక్కరూపాయికావాలి

నా – పొద్దున్నే యింటికొచ్చావ్. అడగలేక పోయావా కానీ లేదు, సాయంత్రమే యిచ్చేశాను

సూ – మా ఆవిడకు ప్రసవించే ఘడియలు మంత్రసానిని తీసుకురావాలి. ఒక్కరూపాయి మాత్రమే, సుబ్బారావ్

సు – ప్రస్తుతారీకున జీతాలు. యివ్వడెలావస్తాయ్ నేనే చాలా బాధ పడుతున్నాను

సూ – మూర్తి నీ దగ్గరుంటే చూడు

మూ – వుంటే యివ్వరూ. యింత సేపు అడగనిస్తామా

సూ – అయితే యింతేనా ఒక్క సమాజం సభ్యులం మన మంతా మాకు తెలుసు నా పరిస్థితిఅంతా. వుద్యోగంలో వుండగా ఎంతడబ్బు ఖర్చుపెట్టాను. ఆనాడు మీరంతా ఎంత గౌరవంగా చూసారు వీరునలుగురూ నాలుగు పావలా లిస్తే ఒక్కరూపాయి అవుతుంది మూర్తి నీపర్సులోయ్ డబ్బులేకుంటే అక్కర్లేదు

మూ – వుంటే యివ్వమనివుందా

అందరు – ఎవరినన్నా అడుగుయిస్తారు మాతో దండయాత్ర మొదలెట్టావేమిటి

సూ – దండయాత్ర మొదలెట్టానా అవును మీకు అవసర ముంటే నన్ను ఉపయోగించుకుంటారు. తెరలు కట్టాల్సివస్తే నేనుకావాలి మిమ్మన్ని రిహార్సల్సుకు పిలవాలంటే నేను కావాలి. మీకు కాపీలు కావాలంటే నేను కావాలి నాటకం అయినతర్వాత మీరంతా కుర్చీలల్లో కూర్చోని పోజులిస్తూవుంటే తెరలు విప్పటానికి నేను కావాలి, నాభార్య చావు బ్రతుకుల మధ్య అల్లాడు తుంటే ఒక్కరూపాయి యివ్వటానికి ఎవ్వరిదగ్గర లేదు. అంతగా యిదిగా మీలోవున్న సాను

భూపతి. (భోరునఏడుస్తూ) మీయిష్టంవచ్చినట్టు నన్ను వుపయోగించుకున్నారు ఎవరి తప్పుకాదు. నా దేతప్పు ఈనాడు డబ్బుంటే గౌరవం వస్తుంది. డబ్బులేనివాడికి స్థానంలేదు. ఎక్కడచూచినా యింతే నీతినిజాయితీకి స్థానంలేదు. నా బ్రతుకంతే మీనిజస్వరూపాలు యిప్పటికి. అర్థమైనాయి మీనటకులు. దేశంలో స్వార్థపరులు పెద్దమనుష్యులుగా చెలామణి అవుతున్న వాళ్ళు ఈనాడు నిజస్వరూపాలతో ఎట్లానాటక మాడుతున్నారో నాటకంద్వారా పెద్దమనుష్యుల నిజస్వరూపాలు బయటపెట్టారు. కాని మీనిజస్వరూపాలు బయట పెట్టుకోలేక పోయారు. నాలో కొన్ని తప్పులున్నాయి ఒప్పుకుంటాను. నిజంతెలుసుకున్నాను యిక మీకూ మీసమాజానికి ఒకనమస్కారం. వెళ్తూన్నాను. ఒక్కమాట, ఏనాటికైనా నిజస్వరూపాలతో నాటకం ఆడుదాం అనుకున్న వాళ్ళకు మాత్రం స్థానముందని గ్రహించండి. (వెళ్తున్నాడు)

మూ : (సూర్యం చొక్కాపట్టుకొని) ఏమిట్రావాగావ్ మేము నిజస్వరూపాలతో నాటకం ఆడామా

సూ : అవును నాటకం ఆడుతున్నారు

సు : చూస్తావేరా. ఊఁ. కానీ

ప్ర : (వెనుకనుంచివచ్చి) ఏం కూశావ్. (కొట్టబోయాడు)

సూ : (పెద్దగా నవ్వుతున్నాడు)

మూ : (ఆశ్చర్యపోతూ) ఎందుకట్లా నవ్వుతాన్

సు : పిచ్చెక్కింది

సూ : మీాకురాపిచ్చి, ఎలావుంది నాయాక్టింగ్

మూ : యాక్టింగా

సూ : తెరలుకట్టేవాడికి యాక్టింగ్ అంటే తెలుసురా మీాగుత్త సొమ్మేకదూ యాక్టింగ్

ప్ర : నవ్వకపోతే కొట్టేవాడ్నిరా. ఆ ఏడుపంతా ఎక్కడనేర్చుకున్నావ్. యికనుంచీ నువ్వూ వేశాలు వెయ్యిరా

సూ : వేశాలెందుకులే యిలా ట్రతకనివ్వండి. ఆ. మరచిపోయా తెర వేయడం. (అంటూవెళ్ళి తెరవేశాడు)

(తెర)